గంధర్వ, యక్ష, సిద్ధ, సాధ్య, చారణ, విద్యాధర, అప్సరస, నాగ, కిన్నర, కింపురుష జాతులవారును, రాక్షసులలో దానవ, దైతేయ, పిశాచ, అసురాది గణములు నుండెను. ఖగోళములోనుండిన దేవతలను (ఇంద్ర వరుణాదులు) గురించి ముందుపుటలందున్నది. మనుసంతతి వారుమానవులై అయోధ్యాది స్థలముల నివసింపజొచ్చిరి. మనువు యింద్రరాజ్యమునకు, అయోధ్యాది రాజ్యములకు చక్రవర్తిగా నుండెను. ఇట్టి మనువులు 6 గురు గడచిరి. దేవరాజ్యమునకు, మానవరాజ్యమునకు అన్యోన్యత యుండెనుగాని రాక్షసులకు దేవరాజ్యమునకు విరోధములు హెచ్చి అనేక యుద్ధములు జరుగుచుండెను. మానవులు దేవతలకు సహాయులై నిలచిరి. ఆ వివరములన్నియు ముందుపుటలలో చెప్పబడును. మానవరాజులు కొందరు దేవరాజ్య పాలన గూడ నప్పుడప్పుడు చేయుచుండిరి. మొదటి మనువు ఆడపిల్ల కిచ్చిన భూభాగము దేవరాజ్యముగాను, మగసంతతిది మానవ రాజ్యముగాను అయ్యెను నాటినుండి భారత యుద్ధకాలమువరకు యీ దేవరాజ్యమును, అందలి చిన్నచిన్న యధిపతులు (అగ్ని, యమ, వరుణాదులు) ను ఉండెడివారు. జలంధరుడు, త్రిపురాసురులు, బలి, బాణుడు, హిరణ్యకశ్యపుడు మొదలగు రాక్షసులకు జలంధర్, త్రిపురి, సోనపూరు మున్నగు నగరములు రాజధానులుగా కొంతపాలన యుండెను. నాగపూరున నాగులును, ఖర్గపూరున గరుడులును, కందహారున గంధర్వులును, అలకాపుర ప్రాంతమున యక్షులును, నివసించుచుండిరి. వామనుడు బలిచక్రవర్తిని పాతాళమునకు పంపువరకు అనగా దక్షిణహిందూదేశమునకు పారద్రోలువరకు రాక్షసులు

---

నదియే దేవమాన మయ్యెననియు, నా ప్రాంతమున వారు కేవల మాంసాహారు లగుటవల్లనే తర్వాతగూడ దేవతార్యులలో నీయాచార మున్నట్లును కొందరు పండితు లిటీవల గ్రహించిరి. హిమాలయ పరిసరపు దేవికానది వద్దనే మానవ యుత్పత్తియని భారతమున నున్నదిగాని యిరాను మున్నగు చోట్లనుండి వీరు నానాచోట్లకు వలస వెడలినట్లును, తత్పూర్వము ధృవ ప్రదేశ వాసులనియు అవెస్తా వాఙ్మయమువల్లను, ఋగ్వేద దృష్టాంతము వల్లను దెలియుచున్నది. (ఋ 7–87–7) సప్తసింధునుండియే యిరాను మున్నగుచోట్లకు వెడలిరనుటకు గూడ కొన్ని ఆధారము లున్నవి.



ఉత్తరదేశముననే నివసించిరి. బలి, బాణుని వంశీకుల శాసనములు చిత్తూరు జిల్లాలో దొరికినవి. ఇవి 11వ శతాబ్దినాటివి. మనువులు ఆగ్గుర మన్వంతరాలు (మొదటిఆరును) 1200 సం॥లకన్న హెచ్చుకావని లోగడ తెల్పితిమి. 7వ వైవస్వతమనువు ఆరంభముతో కృతాయుగారంభ మయ్యెనట. అప్పుడు సూర్యవంశంలో ఇక్ష్వాకు మొదటిరాజు. అతనితో మూడు తరములు గడువగనే పురంజయుని కాలముననే కృతయుగము అంతమయ్యెనట. చంద్రవంశములోగూడ నట్లే 3 తరములు గడచుసరికి పురూరవుని కాలముననే యుగము మారెను. మూడు తరములకు హెచ్చుగా మనుస్మృతి ప్రకారము లెక్కవేసినను 150 సం॥ల కన్న హెచ్చులేదు. దీనికి 4800 దేవమాన సంవత్సరములు గడచినట్లు లెక్కవేసిరి. మన సిద్ధాంతు లీకాలమునే మహాయుగముగా బేర్కొని 12 వేల దివ్యవర్షాలనిగూడ చెప్పుచున్నారు. పైన నుడివినట్లు యీ హెచ్చు సంఖ్యలన్నియు సృష్ట్యాదినుండి వచ్చిన కాలము లెక్క సరిపెట్టుటకే వేయబడినవి. అయినచో నిజమైన లెక్క తేలుటెట్లు ? దానినే క్రింద వివరించెదను. ఋగ్వేదములో నైదుసంవత్సరములకొక యుగము చెప్పబడినది గాని యీ పద్ధతి తర్వాత మార్చబడెను.

ఇక్ష్వాకు మొదలు భారత యుద్ధకాలమువరకు నున్న బృహద్రథుని వరకు ఆ వంశములో 88 లేక 83 తరములు మాత్రమే జరిగినవి. (అనుబంధము చూడుడు.) వీనికి మన పూర్వుల లెక్కప్రకారము 27 మహాయుగములు (ప్రతిమువ్వురకు ఒక యుగం) జరిగినట్లున్నను నిజమునకు 4800 సం॥ల కన్న హెచ్చుకాలేదు. అనగా మన పూర్వులు చెప్పిన దేవమానములు అంతరభేదములు మిథ్యయని త్రోసివేసి చూచుకొనుచో తరమునకు యేబదిపైగా సం॥లు లెక్కించినను నాలుగు సమానయుగములు జరిగినట్లు కనబడును. యుగమునకు 1200 మానవ సం॥లే మొదట జరుగుచున్నట్లును, భారతయుద్ధమువరకు అట్టివి ఇక్ష్వాకు మొదలు 4 జరిగినట్లును, తత్పూర్వ మొకటి మొదటి మనువునుంచి ఆరవమనువు వంశము ఆఖరు వరకు జరిగినట్లును మనము స్పష్టముగా భావింపవచ్చును. మన పూర్వులు సృష్ట్యాది లెక్కను చెప్పుటకొరకే యుగసంఖ్యలు పెంచిరని లోగడ తెల్పితిమి. ఇట్లు పెంచుటలో కృతయుగమునకు 4 రెట్లు, త్రేతకు 3 రెట్లు, ద్వాపరానకు 2 రెట్లుగాను పెంచుటయేగాక అన్నింటికి దేవమానమ్యామును